# నా కథ

(రెండవ భాగము)

నవయుగ కవిచక్రవర్తి

జి. జాషువ

బుక్‌లవర్సు ప్రైవేటు లిమిటెడ్

గుంటూరు : : హైదరాబాద్

# ఒక మనవి

ఇది నాకథలో రెండవ ఘట్టం. ఆత్మకథలు విఖ్యాతపురుషులు వ్రాసుకోవడం పరిపాటి. నే నాకోవకు చెంది లేక చెందగోరి యీ కావ్యాన్ని వ్రాయలేదు. నేను భాషాపరిశ్రమ మిక్కిలి చిన్నవయస్సులో నారంభించడం, కవిగా గుర్తింపపడడం ఆదరణ ఆలంబం లేక పడ్డపాట్లు యథాతథంగా బాల కళాసేవకుల దృష్టికి తేవడం నా ముఖ్యోద్దేశం. సాధారణంగా స్వీయకథలన్నీ గద్యాత్మకాలై యుంటాయి. పద్యంలో యుంటే గద్యపద్యప్రియుల కిరువుర కుపకరిస్తుందని పద్యంలోనే కథ సాగించాను. మొదటిభాగ మిప్పటికి పలుమార్లచ్చయి ప్రచారంలో యున్నది. సహృదయుల ఆదరాభిమానాలే నన్నీరచనకు పురికొల్పినయి. నలుబదేండ్లక్రింద

"అల దిగ్దంతులవంటి పండితుల కా
వ్యాంభోధులం దూర్మిశ
య్యల నుయ్యాలల నూగు మీ
చరణ దీవ్యద్దర్శనార్థంబు రా
తలకన్ నాకవితాకుమారి, నరనా
థా! ముద్దరా లేమి సా
మ్ములంతో రావలెనో యెఱుం
గదు భయంబున్ దీర్చి మన్నింపవే."

అని పిఠాపురీశుని దర్బారున చెప్పుకొన్నట్లు, లోకమెఱుగని ముద్దరాలైన నాకవితాబాలికను సమాశ్వాసించి ఆదరించి, చేయూత నిచ్చిన శ్రీసత్యవోలు గున్నేశ్వరరావు, శ్రీ రాపూరి శ్రీశైలపతి, శ్రీ జాగర్లమూడి కుప్పుస్వామిచౌదరి శ్రీ సానెకొమ్మి మాలకొండారెడ్డి ప్రభృతుల సహాయసానుభూతు లీకావ్యంలో వర్ణితాలైనయి. జీవితాన్ని నాల్గుభాగాలుగా పూర్తి చేయదలచాను. మిగతా రెండుభాగాల్లో నాకు పోషకులుగా ప్రోత్సాహకులుగా తోడ్పడ్డ రసజ్ఞులను. అభిమానులను సన్మానాదికాలను కష్టసుఖాలను తెలుపుకోగలను. ఈకావ్యాన్ని విద్యాగురులు, కళాపిపాసువులు అయిన కీర్తిశేషులు శ్రీ ప్రత్తిపాటి ఆదినారాయణగారికి అంకితం చేస్తున్నాను. ఈ కావ్యం బహుజనామోద మందగలదని ఆశిస్తాను.

గ్రంథకర్త

శ్రీయుతుడుం దయాగుణవి
శిష్ఠు డుదారుడు ప్రత్తిపాటివం
శీయుడు లక్ష్మయాభిధుని
జ్యేష్ఠతనూభవు డైన యాదినా
రాయణు డస్మదీయకృతి
రత్నమనోహరుడై, కళాజగ
ద్గేయులయం దమర్త్యజగతిన్
జిరకీర్తి వహించుగావుతన్.

# అంకితము

ఓ నవ్యభావదీవ్య
న్మానస ! శుభరూప ! ఆదినారాయణ ! కొ
మ్మా ! నాకథ నమరా
స్థానంబున జదువు మాత్మశాంతి ఘటించున్.

కృతులన్ మృతజీవులు శా
శ్వతులై జీవింత్రు చంద్రభాస్కరముగ, ధీ
యుత; మృతిలే దిక నయుతా
యుతయుగములు తెల్గువాఙ్మయోద్యానమునన్.

తమ్ముడు సుబ్రహ్మణ్యం
డుమ్మలికం గుందు నీవియోగమ్మున నీ
కొమ్మయు సంతానము ని
త్యమ్ముం బెనుశోకతప్తమై తూలు నిటన్,

నందనవనములలో నా
నందంబుగ నుండి ఆదినారాయణ నీ
బందుల మరువక ప్రశుభము
లందింపుము నిరత మమరు లభినందింపన్.

ఇది గండపెండెరంబులు
పదమున గయిచేసినట్టి పండితకవి క
న్నది ముద్దరాలు పలుకున్
విదితంబుగ సుకవివరుల వివిధావస్థల్.

# ప్రత్తిపాటి వంశము

సిరి నిండారగ ప్రత్తిపాటికులరాజీవంబు సంపుల్లమై
మెరయన్ స్వీయచరిత్ర జాతినయనోన్మేషంబు గల్పింప, సుం
దరరూపంబును, దీర్ఘదేహమును, సత్యస్థైర్యమున్ గల్గి న
ల్వురిమెప్పుల్ గొని చన్నలక్ష్మయ యశోభూతిం బ్రశంసించెదన్.

కొండేపుడి చుక్కావం
శుం డగు శ్రీ సుబ్బయాఖ్యు సూనుండై, ద
త్తుండయ్యె ప్రత్తిపాటికు
లుం డగు స్వామికి స్వధర్మలోలుపమతికిన్.

చుక్కలు రాలిన, గగనము
వ్రక్కలయిన సత్యవాక్యపరిపాలనమున్
జక్కగ నెరపి ప్రశంసకు
నెక్కెన్ లక్ష్మాభిధాను డింటం బయటన్.

ఒక సందర్భమునందు కొండొక ధనాఢ్యున్ బట్టి మర్దించి, శి
క్షకు భీతిల్లిక నేరమొప్పుకొని మేజస్ట్రేట్లకున్ న్యాయవా
దకబృందంబున కబ్బురంబును ప్రమోదం బెంతయున్ గూర్చి ధా
ర్మికుడై లక్ష్మయ యాదిమాంధ్రులకు కూర్చెన్ సుప్రతిష్ఠాఢ్యతల్.

చిలకలపుడి హరిజనులకు
తిలకమగుచు, కులమువారిదీనతకు మదిన్
గలత వహించుచు నీచపు
కులవైషమ్యముల నెదురుకొనుచుండె ధృతిన్.

ఆదిమాంధ్రులదీర్ఘదైన్యమును తలచి
మొసలికన్నీరు విడిచెడు మోసగాండ్రు
స్థాపనము చేయు కపటసంస్థల వినిర్భ
యంబుగా విమర్శించి సత్యమును చాటె.

ఆ యలమేలున కీడౌ
శ్రీ యలమేలాంబకరము జేపట్టి, కనెన్
ధీయుతుల సుతల, విబుధవి
ధేయుల, విద్యావివేకదీప్తాశయులన్.

ఆదినారాయణుండు జ్యేష్ఠాత్మజుండు
ఆది బీ. ఏ. మహద్బిరుదాంకితుండు
నగుచు బందరుసీమయం దాదిమాంధ్ర
జాతి కాదర్శచరితుడై ఖ్యాతిగాంచె.

తహసీల్దా రుద్యోగము
వహించి పే రందె ధర్మపరిపాలనధూ
ర్వహుడై మేజస్ట్రేటై
శహబా సనిపించుకొని ప్రశస్తికి నెక్కెన్.

తొలుతన్ బందరు సీమలో కులము సంతోషింప విద్వద్వరే
ణ్యులు మెచ్చన్ తొలిపట్టభద్రు డగుచున్, ముద్దార చిన్నారికై
తలు సెప్పెన్; ప్రతిభావిశేషమున నధ్యక్షత్వమున్ బూని, మె
ప్పులనందెన్; మహదాదిమాంధ్రసభ సమ్మోదించి మోహింపగన్.

శ్రీ సుబ్రహ్మణ్యాఖ్యుం
డాసతిపతులకు కనిష్ఠు డగు నందనుడై
భాసురనిజాన్వవాయమ
హాసౌధస్వర్ణభూషయై జన్మించెన్.

ఇంజనీరు డగుచు నింజనీర్వదవికి
పసిడిసొమ్మనంగ ప్రథ వహించె;
అభివసింపగలుగు యత్యున్నతోన్నత
రత్నపీఠముల నయత్నముగను.

కొంచె మధికారమద్యంబు గ్రోలినంత
మేనుమరచి నిషా రేగి మిట్టిపడెడు
గర్వితస్వాంతులకు బుద్ధిగలుగునట్లు
సర్వసామాన్యుడై తగ్గి సంచరించు.

పదవు లొసంగి, పేదల కభాగ్యుల కన్నము బెట్టి, ధర్మపు
న్నొమదవు ముదశ్రువుల్గురిసి పుష్టివహింపగ సత్వవాగ్విశా
రదు డయి, ప్రత్తిపాటికులరత్న మితం డన తండ్రికీర్తికిన్
కుదురయి, నేర్పె దుర్మదులకున్ సిసలైన పవిత్రశీలమున్.

వదరుంబోతుల బోలి పెక్కుపలుకుల్ భాషింప డేనాడు; నె
మ్మదిగా, కమ్మగ నొండు రెండు పలుకుల్ మాటాడు; నమ్మాటలం
బొదుపు న్నిండుదనంబు; శ్రోతలకు సమ్మోదంబు గల్పించు; ఆ
పదలందున్ దొణకండు; సాజ మిది సుబ్రహ్మణ్యధీశాలికిన్.

అట్టి రత్నద్వయంబునం దగ్రరత్న
మాదినారాయణుండు బ్రహ్మైక్య మంది
గూర్చె నారనిశిఖి గర్భగోళమందు
బలగమునకును సోదరతిలకమునకు.

అన్న గతింపగా భువన మంధతమస్సున మున్గ గుండియల్
భిన్నముగా తపించి, పలవించి, కృశించి, ''ఖిలమ్మగానిదై
మన్నన కెక్కనట్టి యసమం బగు సత్కృతి నంకితంబుగా
అన్నకొసంగి నాదు హృదయవ్యథ తీర్పు'' మటంచు కోరినన్.

నాకథ యను నూతనకృతి
నాకావాసునకు నాదినారాయణను
శ్లోకున కంకిత మిచ్చి శు
భాకార మొసంగినాడ నమ్మహితునకున్.

# నా కథ

యౌవనమున వేధించెడు
పూవులవిలుకాని నేస్తమును సల్పితి నే
నేవో ప్రణయకలాపము
లావీటన్ రసికకవిమహాశయులవలెన్.

అందరము పుట్టుపాపుల మని యహేతు
కముగ భయబీజములు నాటి కలతపెట్టి
బ్రతుకు, మతబోధకుల యనుగ్రహము తప్పి
సంఘబాహ్యుడ నైతి క్రైస్తములయందు.

పాపి వీ డటంచు పదుగురు గుమిగూడి
యేసుక్రీస్తుప్రభున కెఱుకజేసి
బాగుచేయుమంచు ప్రార్థింపసాగిరి
మేటిబోధకులును, మిషనరీలు.

ముమ్మాసంబులకును రౌ
ప్యమ్ములు మూ డౌసగుచుండు పంతుళ్ళకు జీ
తమ్మపుడు దొరలు, నా కీ
కుమ్మడ్డముబెట్టి మానుకొన్నా రదియున్.

ఊదెం బడిపంతులు పని
యూడె న్మర్యాద: యూడె నుత్సాహము లో
నూదని సంసారము వెం
టాడం దిరిగితిని పల్లియలు పట్టణముల్

ఆరోజుల నవలున గల
టూరిం గ్సినిమాలలో కడుంగడు శ్రమతో
జేరితి నొక సినిమాలోన క
థారచయితగాను, తత్కథాకథకునిగా

వేతనము పదియు నైదును
చేతోమోదంబె కాని చేతికి నిడ డా
నేతృమణి, చిల్లిగవ్వయు,
ఖాతే ప్రాప్తంబు రెండుపర్యాయంబుల్.

ఇది యొక శిక్షలె మ్మనెడు తృప్తివహించి, సమస్తచింతలన్
జిదిమి ముదంబు గూర్చి పరసీమలకుం గొనిపోవు కావ్యశా
రదను భజించుచున్ దుదకు, రాజమహేంద్రమునందు నౌకరీ
వదలితి నాప్తమిత్రుసహవాసబలం బవలంబనంబుగన్.

గౌతమీతీరకోటిలింగాలవద్ద
ప్రాథమికపాఠశాలలో పంతులునయి
జీవనము చేసినాడ నేత్రోవ లేక
ఎనిమిదిన్నర మాసవేతనము మీద.

క్రూరంబైన ప్రపంచయుద్ధపు ఫిరంగుల్ నిప్పులన్ గ్రక్కు సబ్
మైరిన్లున్ మదరాసుపట్టణముపై, బాంబుల్ ప్రయోగించి, కం
గారెత్తించిన రోజు లవ్వి, మనయాంగ్లస్వాములున్ జర్మనీ
క్ష్మారాజుల్ శిగపట్లగోత్రమయి మీసల్ దీటు దుష్కాలముల్.

ఇద్దరుసుతలుం గూరిమి
ముద్దియ మేరాంబతోడ ముట్టెడు జీతం
బద్దెకు ముద్దకు చాకలి
పద్దుకు సరిపోక పెక్కుపాట్లం బడితిన్.

గంటాశారా యను వా
ల్గంటిసహాయమున కష్టకాపుర మెట్లో
గెంటితి నొకయే డప్పటి
తంటాల్ దలపోయ గుండె దడయున్ గల్గున్.

కదనమున సైనికుడనై
బ్రదుకుట మేలంచు సిద్ధపడి రిక్రూటింగ్
సదనమున కేగ ముగిసెం
గదనం బానాడె. యేమి గ్రహచారంబో.

నాకవితాకండూతియు
నాకూర్పున్ నేర్పు జీవనపు టొడిదుడుకుల్
నాకష్ట మాకళించిన
ధీకవితుం డొక్క భూమిదేవుం డుండెన్.

మాటలపుట్ట, నాస్తికు, డమాయకుడుం, గవి. పండితుండు, తో
లేటికులుండు, ప్రాయము ఫలించిన వృద్ధుడు, సుబ్బరావు. నా
గాటపు కష్టజీవనము గాంచి విచారము నంది, మత్కళా
పాటవము న్నుతించి బహుభంగుల ధైర్యము చెప్పు నెప్పుడున్.

ఇరువుర మఖండగౌతమి
సరిత్తటిం జేరి, వివిధసత్కావ్యనిరం
తరగోష్ఠి ప్రొద్దుబుచ్చెద
మరుణారుణసంధ్యలందు ననువారంబున్.

ఆసుబ్బారాయం డొక
వాసరమున చెప్పు మొక్కపద్యంబును, గో
దాసరిదభివర్ణన మని
ఆసక్తిం గోరె మందహాసాననుడై.

పుట్టి గతించిపోయెడు నృపుల్ ధరణీవిభవంబు గోరి నీ
గట్టున నుగ్రసంగరముడాంబున నెందరు గ్రుంకినారొ; నీ
పొట్టకు వారియస్థికలు భోజన మయ్యెగదమ్మ; చావులే
నట్టి సుధాశరీరమహిమాన్వితవందన మమ్మ; గౌతమీ!

అని చెప్పిన విని, "వహవా!
మొనగాడవు జాషువా! యపూర్వంబగు క
మ్మనిపాకము నుడికారము
తెనుగుందన" మంచు బొగడి దీవెనచేసెన్.

''గున్నేశరాయ డను సం
పన్నుం డీయూర గలడు, బ్రహ్మణ్యుడు, వి
ద్వన్నుతుడు, నటవిగాయకు
లన్నం గవు లన్న నాశ్రయం బిచ్చు కవీ ?

చను మీయుత్తర మి'' మ్మని
యనురాగం బొలుక బలికి యంపిన, నేనుం
జని యా గున్నేశ్వరు
గని సుబ్బారావుగారికమ్మ నొసగితిన్.

అరనెరసి యున్న గుప్పెడు
బిరు సగు మీసములు, వదనబింబమ్మున రా
చఱికపు హుందాతనముఁ
వరభూషలు సత్యవోలు వంశేందునకుఁ.

పిడికెడు మీసముల్, నయనవీథుల రాజస, మాననంబునన్
జడధిగభీరతాగుణము, చామనుచాయశరీరదార్ఢ్యమున్
నడిమివయస్సు చూపరమనంబులు లోగొను మూర్తితోడ, నా
యెడద చలింప నిట్టు లనియెన్ మృదువాక్పరిపక్వచిత్తుడై.

"ఊ రెయ్యది ? పే రేమి ? కృతుల్
కూరుతువా ? భేష భేష ! గురు వెవ్వరు ? మా
ధరణీసురులు సనాతను
లేరీతి సహింత్రు బ్రాహ్మణేతరప్రతిభల్.

కావ్యపంచకంబు కన్నావె ? గీర్వాణ
వాణిపరిచయంబు బడసినావె ?
అల్లగలవె పద్య మాశువుగా ? యేది
పలుకు మొక్క చిన్నిపద్దియమును.''

అని కట్టెదురం గుద్యం
బున వ్రేలెడు చిత్రఫలకముం జూపిన, చ
య్యన నాశుధార నొడివితి
వినుకొండవిశిష్టతయును వివిధాంశంబుల్.

గౌడడిండిమభట్టుని కంచుఢక్క
పగులగొట్టించు కవిసార్వభౌమునిల్లు
భాస్కరుని కత్తి మెరసిన ప్రథనభూమి
శిరము నెరసిన వినుకొండసీమ మాది.

మగ దడవి డింప బంపిన
వగ గుంది కృశించినట్టి వైదేహి కయో
ఖగమృగ సంతతియే బం
ధుగణంబై యూరడించి తోడై నిలిచెన్.

చిత్రపటములోని సీతను వర్ణించి,
కొన్నిపద్దియములు కూర్చి చదువ
మందహాసరోచు, లందమౌ నమ్మిన
కట్టు దాటి మిట్టిమిట్టిపడియె.

చెలిమి న్నాదుభుజాగ్రమున్ గుదుపుచున్ చింతామణీ నాట్యమం
డలికి న్నాటకముల్ రచింపుము కవీంద్రా! ముందుగా కొమ్మదే.
నెలజీతం బని రౌప్యవింశతి నిడెన్ చిత్తంబు పొంగార; నా
పలుకుందొయ్యలి తాండవించె నవభావస్వర్ణభూషాఢ్యయై.

వేయిగజాలశక్తి ప్రభవించె మనంబున; నభ్యసించితిన్
రేయిబవల్ మహాకవివరేణ్యులపోకడలున్, చమత్కృతుల్,
నాయకనాయకీవివరణంబులు, రాయలదిగ్గజాష్టకో
ద్ఛాయరసోజ్జ్వలత్కృతుల సంహితలన్ ఘనబృంహితంబులన్.

సాయంసంధ్యారక్త
చ్ఛాయారుచిరాంబరములు చక్షుర్ముదమున్
జేయు మహాగౌతమితటి
హాయిగ నొక పులినసీమ నాసీనుడనై.

విరచించితి 'శ్రీరుక్మిణి
పరిణయ' మను నాటకమును పండితులు కవీ
శ్వరులుం దలలూచగ, మె
చ్చరు నే డానాటకా లసారము లనుచున్.

తనమేధస్సును దేహదార్ఢ్యము సమస్తంబున్ వితంత్వాలయం
బునకున్ సాంఘికవిప్లవంబునకు సంపూర్ణంబుగా నిచ్చి ము
గ్గిన పండై, పరలోకయాత్ర కనురక్తిన్ సిద్ధమై మంచమె
క్కిన వీరేశకవీశుదర్శనము జిక్కె న్నాదు భాగ్యంబునన్.

స్త్రీజనసంక్షేమార్థం
బాజన్మత్యాగదీక్ష నమృతకృతమై
తేజరిలు నమ్మహాత్ముని
సౌజన్యాంకితహృదంబు, జం బేప్రొద్దున్.

క్రైస్తవుండ, కవిని, కడుపేదవాడ నా
లంబనంబు నాదరంబు లేని
ఆదిమాంధ్రకులుడ నని నమస్కృతి జేసి
విన్నవించుకొంటి స్వీయచరిత.

ఆదరచ్ఛాయ లాస్యంబు నలమికొనగ
పడకపై లేచి కూర్చుండి గడియ గడియ
దగ్గుతెర లడ్డుపడ గద్గదస్వరాన
"రమ్మ కూర్చుండు" మని సమక్ష మ్మొసంగె.

వినిపింపుము నీకవనం
బను కమ్మనిమాట విని భయంబును దడయున్
బెనగొన వినిపించితి రు
క్మిణికల్యాణమును చాటుకృతి లిక్కరణిన్.

'రుక్మిణీవిరహబాధకు కుంది తల్లి కృష్ణుని ధ్యానించుఘట్టమున'

"అనయంబున్ దవనామమంత్రపవనం బన్నంబుగా చండకుం
డినకాంతారమునం దయోగ్యమృగకోటిన్ నీదుజాయాతప
స్విని కాలంబు నుపక్రమించెడిని, నీ చిద్రూపసందర్శనం
బున ముక్తిన్ గలిగింపవే! తనయ నా మోదింపవే శ్రీహరీ!"

'దుర్గపూజాఘట్టంలో'
"గడిసే పొక్క యుగంబుగా గడపితిన్ కంజాయతాక్షీ! దివం
బులు, రాత్రుల్ ఘటికాసహస్రములు; రేవో! మావో! యేతెంచి, కా
వదె, నాథుం డని యిప్పు దేమని తలంపన్ జాలుదున్ నాథ! నా
ల్గడుగుల్ సాగెదు కాల మున్నది మహాత్మా! ముంతువో తేల్తువో"
'యుద్ధఘట్టంలో'
"ఆవంకం బరువెత్తుడీ! అదుగొ కన్యాతస్కరుం దేమి సా
క్ష్యా! వెంటాడవు? పౌండ్రకా! కలసిరా; వాలస్యమా? దంతవ
క్త్రా! వారింపు విదూరదా? కదన మారంభింపుడీ! యోధులా
రా? వైళంబ అదల్పుమీ నడుపుమీ రథ్యంబులన్ సారథీ!"

"మంధాద్రిప్రతిమానధైర్యబలవన్మాంసాళనోన్మత్తదు
ర్గంధేభోన్నతకుంభభేదనకళాప్రావీణ్యు డీతండు, గ
ర్వాంధత్వంబున తూలనాడితివి మాయన్నన్ మురారిన్, జరా
సంధా! నీమద ముక్కడంతు విలుమీ సంగ్రామరంగంబునన్."

సందేశం.
"ఎఱిగియుందువు సర్వంబు నెఱిగియుండి
ఎఱుగన ట్లుండి యెఱుగని నరులచేత
నెఱుకపరపించుకొందు వే నెఱుకజేయ
నెంతదానను కడ కింతి నేలుమనుము."

చదివినపద్యముల్ విని ప్రసన్నమృదూక్తుల, "మేలు మేల్ మహో
ద్యుదయము ముందుముందు గలదోయి కవీ! కులభేదశాకినుల్
మెదలెడు దేశ మిద్ది నిను మెచ్చదు, మెచ్చిన మెచ్చకున్న శా
రద నిను మెచ్చె; మానకుము ప్రాప్తకవిత్వపరిశ్రమంబులన్.

గున్నేశరావుగారు ప్ర
సన్నులగుట మెచ్చదగ్గ సంగతి యిది, నీ
యున్నతికి మొదటిమెట్టగు
కన్నెకళల కతడు కల్పకంబంద్రు కవీ!"

వ్రాసి ముగించితి కతిపయ
వాసరముల నాటకమును వహావా! వా! శహ
బా సనె గున్నేశ్వరుడుం
వాసికిరా దొడగె పేరు పదుగురిలోనన్.

శ్రీపాదవారి బొబ్బిలి
నాపురి నాటకసమాజ మాడుచునుండన్
మోపుగచూచితి నక్కవి
తాపద్ధతి నచ్చదయ్యె తథ్యము సుమ్మీ!

పడికట్టురాళ్ళతో, క్రిం
గుడువడని పదాలతోడ గురువీరకథా
జడనిధియగు బొబ్బిలికథ
ముడిబెట్టి ముగించినట్లు బుద్ధికి దోచెన్.

ఏ దెబ్బైనను వీరబొబ్బిలి పదంబే ఆంధ్రరక్తంబునం
దూదున్ బౌరుషబాడబాలనము వీరోత్సాహ ముప్పొంగి, యు
న్మాదం బెత్తి యువాను డొక్కడు సభామధ్యంబునం జంపె, దా
యాది న్నే నలపాపరాయడనురా యంచున్ గఠోరంబుగన్.

కవిహృదయ మెరిగి నటక
ప్రవరు లభినయింప రసము రంజిలు, కథ వా
స్తవమగు ప్రేక్షకు లెల్లరు
నవుదురు నటకులుగ పొల్తు రభ్రాంతమునన్.

కొండప్రాయడు పాపరాయ డయి, యుద్ఘోషించి, రోషించి, యు
ద్దండాకారత రంగమధ్యమున ప్రత్యక్షించి రామక్షమా
ఖండాధీశ్వరు సంహరించు కరకుంఘట్టంబునన్ ప్రేక్షకుల్
బండంబారెద రిప్పుడున్ మది తలంపం గంప మేపారెడిన్.

మల్లమ్మదేవియై, నట
తల్లజు డగు జగ్గరాజు దర్శన మిడగా
యెల్లెల్ల కండ్లుగల సుర
వల్లభు డగుచుండు తత్సభాస్థల మెల్లన్.

యమునాతీరపు సైకతస్థలుల క్రీడాసక్తులై వేణుగా
నములన్ సల్పుచు సత్కవుల్ ప్రణయసౌందర్యంబు లర్చించుచో
సమరోన్మత్తజగంబునన్ వెలుగు నాశాంత్యంశువుల్, ప్రేమకా
వ్యము లీదేశదరిద్రతాదవము లార్పంజాలునా ! కాముకా !

పరమార్థం బను నభ్రపుష్పమునకున్ వన్నెల్ విలాసాల్ రచిం
తురు వేదాంతులు దృష్టిగోచరజగత్తున్ మిథ్యగా బల్కి గం
దరగోళంబున ద్రోతు రీప్రజ నవిద్యామగ్నులన్, దుష్కవీ
శ్వరు లమ్మాయిలకై రచింతురు తమాషాగేయవిజ్ఞప్తులన్,

హృదయపరివర్తనంబును సృష్టిచేయు
హృదయ మావశ్యకం బగు కృతుల కెపుడు
రాజుకొని కాల్పగల నిప్పురవ్వ లేక
యెండపెల్లున గాలునే యింధనములు.

కన్నులు లేక కండగల కమ్మనికావ్యము లల్లి భాషకున్
కన్ను లొసంగి నట్టి గుణగణ్యుడు లింగకవీంద్రుశిష్యులన్
మిన్న. నృసింహనామకమనీషివరేణ్యుడు చిల్కమర్తి వం
శోన్నతు జూడబోయితి యశోజ్వలు కొండొకనాటిమాపునన్.

దూరముననుండి యెవ్వరు
వా రని చనుదెంచునట్టివారు ఫలానా
వా రని గుర్తించెడు ప్ర
జ్ఞారాజన్నేత్రు డాత్మనయనుండు జుమీ.

వీథిగుమ్మములో గాలుబెట్టి లోని
కరుగకయముందు రండు రండంచు చెలిమి
కాని నామంత్రణము చేయుకరణి బిలిచె
చక్షు లేటికి, విజ్ఞానచక్షువులకు.

ఆదిమాంధ్రుడ, కవనంబు నల్లగలను
పేరు జాషువ, రఘురామవీరవరుడు
పృథివిజాతాపహరణంబు విన్నచోటు
శ్రుతగిరిపురంబు నాది నృసింహసుకవి!

అని విన్నవింప నాదర
మును ముద మాననసరోజమున వెల్గగ, నా
సనమున గూర్చుండుము ర
మ్మని పల్కెన్ మధురమందహాసం బొలుకన్.

తల పంకించుచు మేలు మేలనుచు నుత్సాహంబు గల్పించు న
య్యలఘుస్వాంతున కస్మదీయకృతు లాయాఘట్టముల్ నిర్భయం
బలరారన్ వినిపింపగా నలరి నేత్రాబ్జంబులన్ సమ్మదా
శ్రులు వర్షించి వచించె ధన్యుడ వటంచున్ బూర్ణవాత్సల్యతన్.

శ్రుతగిరి వాస్తవ్యుడ మీ
కృతు లెరిగినవాడ చూడ నేతించితి, సం
స్కృతిగల్గువాడ, బుధసం
గతిచే కవనంపుదురదగలవాడ నయా.

అని నాకథ క్లుప్తముగా
వినిపింప ముదంబు నంది పీఠం బిడి య
ల్లినపద్దియములు నాలుగు
వినుపింపు మటంచు బల్కె వీను లొసంగెన్

మతవిద్వేషం బను ప్రో
ద్ధతమదదంతావళంబు దంతంబులతో
చితుకం బొడిచిన యొక ప్రా
కృతదేవాలయము మత్పురిం గల దొకచో.

అం దొక పాషాణముపై
సందెకడన్ విశ్రమించి జారిన కాల
ధ్వాంతాంతరాళగతవృ
త్తాంతవిచారంబు మదిని తళుకొత్తంగా,

''ఏరాజన్యుని పాలనంబునను నీ కీదివ్యదేవాలయ
ప్రారజ్యప్రతిరూప మబ్బినది మీయానాటిపూజాపున
స్కారాచారము లేమి? భూమిజ సమాచారంబు రాముం డిటన్
ప్రారంభంబున విన్నవా డట నిజంబా? వృద్ధపాషాణమా!''

అని వ్రాసిన పద్యంబును
వినిపించితి నారసింహవిబుధుడు వదనం
బున హాసరోచి వెలుగం
ఘనసంతోషమున నన్ను కౌగిట జేర్చెన్.

చిలకమర్తి నారసింహు నాశీర్వాద
బలము నాదుకళకు బల మొసంగ
ధృతివహించి వ్రాసితిని 'మదాలస'నాట
కమును మాసపంచకంబునందు.

ఒకడు ప్రోత్సహింప, నొక్కఁడు నిరసింప
నొకడు చేరబిలువ నొకడు తరుమ
మిట్టపల్లములను మెట్టుచు నెట్టులో
పలుకులమ్మ సేవ సలిపినాడ.

నలత్రాచుల్ బలె వర్ణభేదములు నాల్కల్ సాచుకాలంబునన్
వలచెన్ నన్ను కవిత్వవాణి. పసరుం బ్రాయంబునన్ వెట్టిబా
గులదై, బన్నము లందుకొన్నది. విడాకుల్ గోర దీనాడు. బి
డ్డలు పాపల్ గలదై చరించెడిని రాష్ట్రఖ్యాతి నార్జించుచు౯.

ఆంగిలేయ భయదహర్యక్షమును నూలు
పోగు లుచ్చులొడ్డ యోగివరుని
శంఖరవము లింక సకలదిక్కుల మారు
మ్రోయనట్టి ప్రాతరోజు లవ్వి.

రాజమహేంద్రపురి నరామరగా మూడు
వత్సరాలపాటు వాసముండి
కాలజలధిలోన గలసిన వేంగిభూ
భుజులకథలు చిత్తమునను మెరయ.

సారంగధరుని వెచ్చని రక్త మింకిన
మెట్టకు కన్నీటిబొట్టొసంగి
చిత్రాంగిచిత్రాతిచిత్రగాథను జ్ఞప్తి
కందించు జీర్ణహర్మ్యముల నరసి
నన్నయభట్టు స్నానంబాడి చనురేవు
లిదమిత్థ మని నిర్ణయింప దిరిగి
రాజరాజాంధ్రభారతకృతిం గైకొన్న
కొలువుకూటపు చోటుకొరకు నెమకి

పండితులు రచ్చచేసి వివాదపడుచు
ఘనుని శ్రీనాథుదృష్టి కెక్కిన స్థలంబు
యిది యి దౌనంచు నెది నిర్ణయించలేక
మధురమధురస్మృతుల మేను మరచినాడ.

గట్టులు దన్ని పారుచు నఖండరయంబున వచ్చు నద్ధిరా
ట్పట్టపురాణి గౌతమికి భక్తులు కానుక లిచ్చి క్రుంకులన్
బెట్టి చరించు పుష్కరపువేళల వైభవమెల్ల కన్నులన్
గట్టినయట్టు లుండు గతకాలము వచ్చునె భిక్ష మెత్తినన్.

ఆనాటిపుష్కరోత్సవ
మానందముగొల్ప పద్దియము లల్లి యిదే
కానుక నీకని పత్రము
నానదినీరమున ద్రోసి తావేశమునన్.

ఆలోచించితి నిల్లు జేరి నదికి ట్లర్చావిధుల్ సల్పుటల్
మేలే, మేలు ఘటించునే ప్రకృతికిన్ మేధస్సు పెంపారునే
వేలున్ లక్షలసంఖ్యసంఖ్యలు ప్రజల్ విచ్చేసి సద్భక్తితో
పూలుం బండులు కానుకలిత్తు రిదిజబ్బో! లేక ఆరోగ్యమో!

ఇరుగడల తీరభూముల విరగ దన్ని
పల్లియల పక్కణముల గర్భమున గ్రుక్కి
భయదరూపిణియై మహోర్భటి నటించు
కటికినీటికి తలకాయ గలదె తలప!

పొట్టకోస మారెబట్టి గట్టున నున్న
మానవులకు పుట్టుబానిసలకు
వచ్చిపోవువారి పాదరక్షలధ్యాస
తప్ప పుష్కరాలధ్యాస సున్న.

డబ్బు లఖండ గౌతమిజడంబుల జిమ్ముచు భక్తకోటి పె
న్దబ్బులతో తపించెడు ననాథులు చేతులు సాచి మ్రొక్కినన్
కొబ్బరిముక్కలన్ విసరికొట్టుచు తిట్టుట జూచి గ్రుడ్లనీ
రుబ్బ మొగంబు త్రిప్పుకొని యూర్పులు జిమ్మితి వెచ్చవెచ్చగా.

ఒక్క భక్తవరుని నొడిసి యెత్తుకుపోయె
మొసలి యొకటి నీట మసలుచుండి;
''మేలు మేలు పర్వకాలాన జచ్చుట
పున్నె''మనిరి చూచుచున్నవారు.

ఇన్నివేలమంది కేయభీష్టము లిచ్చి
యెట్లు తృప్తిపరచు నీ స్రవంతి
జడపదార్థములకు సచ్ఛక్తు లిండియా
ఖండమందె దాగి యుండునేమొ?

అని పృచ్ఛించితి మిత్రు నొక్కని నతం డాలించి యొక్కింత హే
ళన గావించి "మహానుభావులు ఋషుల్ సంధ్యాద్యనుష్ఠానముల్
మునుకల్ సల్పి తరించిపోయిన మహాపుణ్యాపగాదేవి ద
క్షిణగంగాఖ్య స్రవించు నద్దిసతి, వేంగికొంగుబంగార మౌ".

అనుచు చెప్పసాగె నాతండు పుక్కిటి
కతలు నాకు కొంత మతిచలింప
గ్రుడ్డినమ్మకాల కడ్డుచెప్పుటకన్న
కొఱవితోడ గోకికొనుట మేలు.

"కవనమేద్దువు గాబోలఖండు డైన
శబ్దశాసను డిన్నదీజలము గ్రోలి
వ్రాసినా డంధ్ర భారతగ్రంథ మెల్ల
భీమకవిజిహ్వ కిదె వాక్కు భిక్షపెట్టె.

అస రీనది పగలెల్లన్
రసరూపు ధరించి నిశల రమణీయదివౌ
కసతియై యర్చించెడి
నసమనయను కలువపూల నశ్రాంతంబున్.

గౌతమసన్ముని కీనది
కూతురు, జలరాశి పెండ్లి కొడుకై మునుపీ
గౌతమి జడ నుంచిన కం
జాతసరాల్ నేటి కుదయసంధ్యల పూయున్.

గగనంపుపూవు లరచే
నగుపించెడు'' నంచు భక్తు లల్లినగాథల్
తెగవాగు నతనితో నిక
సిగప ట్లగునంచు బదులుఁ చెప్పక వింటిన్.

వినివిని, ఉత్తమంబగు కవిత్వపటుత్వమఖండగౌతమీ
ఘనతరస్నానపానముల గల్గు రహస్యము చెప్పి జన్మపా
వన మొనరించినాడవు సెబా సని కౌగిట జేర్చి ఖడ్గవా
దన కెడమీక పంపితి, నతండును పోయె సలాము గొట్టుచున్.

ఖాయములగు భిన్నాభి
ప్రాయములే ద్వేషమునకు రహదార్లని నే
నాయువక సఖునిహృదయము
గాయముగా కెదురుపల్కకయ వినుచుంటిన్.

బా ళ థ

పదివేలగొంతు లొకపై
వదరు నబద్ధప్రచారవాహిని కెదురై
బ్రదుకుట దుర్లభ; మెంతటి
యథార్థమున్ దుదకు నగ్నమగుహేళనకు౯.

# భూతపీడ

భూతము సోకెం గొండొక
రాతిరి నాసతికి, ముద్దరా లెదురాడన్
భీతిలు మితభాషిణి, వా
క్చాతురి గల దగుచు లేచె శాంభవికరణిన్.

పాలు ద్రావుచున్న పాపనవ్వల వైచి
పండ్లుగొరికి గుండెబగులనరచి
వెట్టినవ్వు నవ్వి, భీకరాకారయై
చిందులాడసాగె చిటుకలోన.

దయ్యాలపేరు జెప్పిన
నయ్యాలై యూగిపోవుచుండెడు నాకే
తొయ్యలియే పెనురక్కసి
దయ్యంబై పట్టె, విధినితప్ప వశంబే?

యాదాలాబముగా నే
నేదో రచియించుచుండి యిల్లాలిభయో
త్పాదక మగు నాకారం
బదాటుగా జూచి స్తంభితాంగుడ నైతిన్.

నట్టింట బాతిపెట్టెద
ముట్టెపొగ రడంతు నంచు భూరిక్రోధం
బుట్టిపడ బల్కి నామెడ
బట్టుకొనె న్నాయవస్థ పరము డెరుంగున్.

పట్టువిడిపించుకొని నే
నెట్టో పసిబిడ్డతోడ నీవలబడుచుం
బెట్టిన కేకలు విని నన్
జుట్టుకొనిరి పౌరు లనుగు జుట్టాలవలెన్.

భూతమంత్రగాడు మొగదల నున్నాడు
భయము వలదు పిలువబంపినాము
నిబ్బరింపు మంచు నెన రూని నావీపు
జరిచి ఇరుగుపొరుగు పురుషవరులు.

ఎఱ్ఱని కుంకుమతిలకము
నెఱ్ఱని కనుగ్రుడ్లు, గడ్డ మెఱ్ఱనిపంచల్
గుఱ్ఱపు పిడిగల వంకర
కఱ్ఱం గొనివచ్చె మంత్రగా డురుతీవిన్.

అత డుగ్రాకృతిదంతముల్ గొరికి ఆహాకారముల్ చేసి మంత్రితభస్మంబున బొట్టుబెట్టి, ''యిట కేదేశంబునం దుండి వచ్చితివే భ్రష్టపిశాచిముండ ! యిదిగో సీసాల బంధింతు దుర్మతి ! లే" లెమ్మని హుంకరించి గదిమెన్ హ్రాంహ్రాము ధాంధూములన్

విడ్డురపునవ్వు నవ్వుచు
గ్రుడ్డు లురిమి లేచి మాంత్రికుని దిట్టుచు నా
గుడ్డా ! ఎవడుర నీ వని
గడ్డము లంకించుకొనియె కరయుగ్మమునన్.

గుప్పెడు గడ్డం బూడన్
జప్పున దప్పించుకొని "యసాధ్యపు దయ్యం
బప్పా !'' యని మెలిమెల్లగ
దప్పుకొనియె గుంపునుండి ధైర్యచ్యుతుడై.

నా క థ

తల విరియబోసికొని కే
కలు పెట్టుచు లేచి చుట్టు గ్రమ్మిన జనమున్
దొలగుం దని గోదావరి
వలనునకుం బరచె; వెంటబడి రంగనలున్.

మొలబంటినీట బడి, ని
శ్చలముగ నిలుచుండి యేమి జరిగినదే నెం
దుల కింద నీట మునిగితి
తెలుపు డనుచు నడుగ సాగె దీనాననయై.

గండము దప్పె నాంధ్రకవిగానికి రాజమహేంద్రువీట, నె
న్నండొ; యెఱుంగ నీదినమునన్ ప్రియకాంతకతాన నెంతయున్
గండముదప్పె పిల్లకవిగానికి నా కని సంతసించితిన్
గుండె దిటంబు జేసికొని కోమలి నింటికి జేరవైచితిన్.

## నోట్ల కేసు

"చెరసాల కేగె గున్నే
శ్వరరాయడు నాట్యశాల బంధిత మయ్యెన్
పరువుగలవాడు, నూరికి
కరణము, కలవాని కెంతకష్టము వచ్చెన్".

అనుచు బౌరులు గుమిగూడి యాడుకొనెడు
నవసరంబున విని గుండియలు చలింప
పాఠశాలకు చనక తద్వార్తవంబు
నారసితి చింతతో నిల్లు జేరుకొంటి.

నడచెన్ గే సిరువత్సరంబు లల చెన్నాపట్టణంబందు పే
ర్వడి వేపే ల్గడియించు లాయరులు నాంధ్రన్యాయవాదీశ్వరుల్
సడిసన్నట్టి తెలుంగుకేసరి ప్రకాశాఖ్యుండు శ్రీ టంగుటూ
ర్విడుగుం గోర్టు నలంకరించిరి సమర్థీభూతన్యాయజ్ఞులై.

ఆయన చేసిన నేరం
బేయదియో నాటివరకు నెరుగ, దగానో
ట్లాయనయింటన్ ముద్రణ
చేయించుట, వాని నూర చెల్లించుటయున్.

వడుగుల పెండ్లిం డ్లెన్నో
నడిపిన పెనుదాత, బ్రాహ్మణప్రవరుడు నే
డిడుమల బడె నని కటకట
పడి రెంతయు రాజమహేంద్రపౌరప్రముఖుల్.

నాటకసత్కళావనము నాటిన మేటి దయాసమగ్రు డీ
నాటికి జైలుపాలబడి నా డని కన్నులు చెమ్మగిల్లగా
పేటలు పల్లెలున్ వగచి పిన్నలు పెద్దలు వేనవేలు తీ
ర్థాటన కేగువారివలె న్యాయనివేశము నిండి రెంతయున్.

అచ్చెరువు వడుచు నెంతటి
సచ్చరితుడు గాక యింత జనవాహిని నే
డిచ్చటికి వచ్చునే యని
మెచ్చుకొనెన్ సీమజడ్జి మృదులాశయుడై.

నటులకు రచయితలకు సం
కటికరవై, పొసగె నష్టకష్టములు, యె
ప్పటివలె బడిపంతులునై
యటమట బడుచుంటి జారె నాదాయంబున్

కట్టుంబుట్టములెల్ల నమ్మికొని మాకష్టాలకుం దోడు జూ
పెట్టెన్ రిక్తకరంబు లొక్కమడివేల్ విత్తంబు నర్థింపగా
దట్టీగట్టి లడాయికిం దిగియె; శాంతంబూని లోలోపలన్
పుట్టెం దేడుపు పొంగిపోవ నిలయంబున్ జొచ్చి నిట్టూర్చితిన్.

వేసగిసెలవులలో నిజ
వాసమునకు జనుచు విజయవాడను రైల్వే
స్టేసనులో గలసితి ఫిలిప్
లైసనురిం గనెడు నొక కళాకాముకునిన్.

తమ్ముడును నేను నేత్రావధానవిద్య
గర్తపురి ప్రదర్శించినకాలమందు
పరిచయం బైన విషయంబు నెరుకపరచి
చనవుజూపుచు హస్తచాలనము జేసె,

ప్రస్తావవశమునం దొక
క్రైస్తవపండితుడు మాకు గావలె గుంటూర్
బస్తీ ట్రైనింగ్ బడికిన్
"వస్తారా" యంచు నతడు ప్రశ్నించుటయున్.

అంగీకరింప నతఁడు
పొంగుచు మరుమాసమందె ముట్టు మెకాలీ
యఁగన ద్వారా ఆర్డ రొ
సంగుడు సెలవంచు మిత్రసత్తము దరిగెన్.

యాదృచ్ఛికముగ గల్గిన
యాదైవికఘటన నాదు నభ్యుదయకళా
వేదికి రెండవమెట్టని
మోదం బందితిమి కూర్మి పొలతియు నేనున్

గడియలు విఘడియలు లె
క్కిడుకొంచుం బోష్టుమ్యాను లెదురైన హడా
విడిపడుచు నుండవచ్చెన్
పుడికవ రార్డమ్మిడీలు ముదరా గొనుచున్

ఎవరో యనామకుడు కైౖ
స్తవు డొక్కఁడు వధువు తల్లితండ్రులపేళ్ళన్
వివరముకొరకై వ్రాసిన
కవ గది నాపేర నొకడు గల డావీటన్.

అగితి కొన్నినాళు లపుడార్డరు వచ్చె తెలుంగుమాష్టరో
ద్యోగము చేయ రమ్మనుచు, తొయ్యలితో పయనంబు గట్టి యా
శ్రీగల గర్తపట్టణము జేరి మెకాల్డొరసాని జూచితిన్
స్వాగత మిచ్చి యర్ఘ్య మరియాదలుచేసిరి పంతులయ్యలున్.

వయసున నరుబది యేబది
పయిబడి పైౖనింగు జదువువారిం బంతు
ళ్ళయియుందు రని భ్రమించుచు
నయి దార్గరికి నమస్సు లని, సిగ్గిలితిన్

తెలుగుమహాసముద్రమున తీరము జేరుటగాదు గట్టునన్
గిలకలబంటి నీరమున నిల్చిన నే నొకపండితుండనై
కులుకుట యాత్మలో భయము గొల్పుచు నున్నను పైకి బిఱ్ఱుగా
మెలగి ప్రతిష్ఠ నిల్పుకొని మెప్పుల నందితి పాఠశాలలో.

వంగర సుబ్బయ సినిమా
రంగమున నేడు మిగుల రాణించు కళా
చంగుండు నాగురుత్వపు
రం గంటిననాటి శిష్యరత్నంబ జుడీ।

నా పేపబెత్తములచే
తాపులు దిని నెరసియున్న తలతో కవియై
యేపారు వేమరెడ్డియు,
కోపించుం గురుత నొప్పుకొన కీనాడున్.

డంబాల ఆడుపెత్తన
ముం తంబళదొరతనంబు పోలిక మేకా
ల్యంబాదొరతన మతిక
ష్టం బా బడిగురుల దయకు సాయాహ్నములన్.

పంతుళ్ళమీద నూరక
గంతులువెట్టుచును చిన్నికారణములు పె
ద్దింతలుగ దలచి నెల కొాక
పంతులుపని యూడగొట్టి పంపుచు నుండన్.

నాకు నిరుమూడుమారు ల
దేకర్మము సంభవించి యే దైవదయా
లోకనబలమో శ్రీముఖ
మీకుండె మెకాలిదొరకు నిష్ఠుడ నగుటన్.

డీయీవో, బడితనిఖీ
జేయుటకై వచ్చు చలువజేసిన డ్రసు నొం
డీయంగలవా యని రా
జా యను పక్కింటిమిత్రు నర్థించుటయున్,

టిక్కెటు కలెక్ట రాతం
డక్కాలమునందు పెట్టె లన్ని వెదకి యీ
చొక్కా షరాయి తాల్పుము
పక్కాదొర వగుదు వంచు, వాక్రుచ్చుటయున్.

నల్లనిసూటుతో మిగులనల్లని నెక్టయితోడనంతకున్
నల్లనిబూట్లతోడ నొకనాడు తయారయి స్కూలు కేగితిన్
బళ్ళకు వల్లభుం డయినవాడు, గుణాఢ్యుడు వచ్చె డీ. యి. వో.
తెల్లని తాంసనాఖ్యుడు విదేశజు డెంతయు శాంతమూర్తియై.

డీయీవో తనిఖీ ముగించుకొని యేడీ పండితుం డంచు న
న్నే యాహ్వానము జేసె, నేను చని సాన్నిధ్యంబునన్ నిల్చితిన్
నాయాకారము సూటు బూటు గని తీక్ష్ణంబైన కంఠాన ''నాం
గ్లేయాచార్యుని గాదు పో'' మ్మనుచు బల్కెన్ నన్ను కోపించుచున్.

''ఇత డాంధ్రపండితుం డని
కృతులున్ రచియింపగల కవీశ్వరు'' డంచున్
బ్రతిచెప్పె పెద్దపంతులు
నతదేహుం డగుచు గడు వినమ్రత; దొరకున్.

''గుండుమీద పిలక, కుండలమ్ములజోడు
పండితులకు సహజమండనాలు
పైన నింగిలీషులో నాంధ్రమాః పాత
పండితుం'' డటంచు బలికె దొరయు.

యేసూక్రీస్తునిపుట్టువు
వ్రాసితి నాటకముగా యభాగ్యపుమతస
న్యాసులయనాదరణమున,
భాసింపకపోయె నదియు పనితనముననే.

భారతీమాసపత్రిక ప్రభవమంది
పలుకులవెలందిసందాలు జిలుకు వేళ
వ్యాసకర్తగ కాశీకులాబ్రహేళి
యెలమి న న్నెన్నుకొనియె నాగేశ్వరుండు.

ప్రకటింపంబడె భారతిన్ దొలుత కర్ణవ్యాస; మైదారునా
ళ్ళకు నీపద్యము లింపుచేయగ విరాళం బంపుచున్నారు పా
తికరూపాయలు విశ్వదాతలని యాంధ్రీపత్రికాఫీసుము
ద్రికతో ద్రవ్యము నుత్తరం బొకటిచేరె న్నా కనూహ్యంబుగన్.

కన్న కలలెల్ల నిజములే గావుగాని
నాయదృష్టంబుకతన స్వప్నంబు లిట్లు
తథ్యమై విశ్వదాతృనాదరణమునకు
నన్ను గురిజేసె ననుచు నానందపడితి.

అచ్చొత్తించితి రుక్మిణీపరిణయం బచ్చోట నిచ్చోట, నే
బిచ్చంబెత్తి క్రమక్రమంబుగ ప్రజాప్రేమాదకం బబ్బె, నీ
కుచ్చస్థానము జిక్క నన్న హితవర్యుల్ బంధు లాడాడ వా
క్రుచ్చన్ వించు పరిశ్రమించితి తెలుంగుందోట పుష్పింపగన్.

చాలీచాలని రాబడి
అలికి నా కనుగుసుతుల కటునిటు కాగా
కాలము గడపుచు నాలుగు
నాళుల విలిఖించినాడ నవల నొకండున్.

కలరు, తెనాలిలో ధనము గల్గిన పుస్తకవర్తకుల్ కొనం
గల రని సిద్ధమై, దిగులుగా పయనించుచు రైలుపెట్టెలో
గలసితి మేల్మిబంగరు జగాజిగి గల్గిన మేనివన్నెలన్
గలిగిన ధారుణీసురుని కామశతప్రతిమానవిగ్రహున్.

భట్టిప్రోల్కులవీరుడు
రట్టడి సూర్యప్రకాశరాయడు రౌడీ
జట్టులనాయకు డింకొక
తట్టున గూర్చుండి యుండి దరికిం బిలిచెన్

నాకవన మెపుడొ యొక్కిం
తాకర్ణించిన సుపరిచయంబున యితడే
నీకు న్నే జెప్పిన జా
షాకవి యని చెప్పి నన్ను పరిచయపరచెన్.

శ్రీశైలపతియితండు క
వీశుల ప్రేమించు త్యాగి వీరుడు కలవా
డాశువుగా నీకవితా
ప్రాశస్త్యము దెలియ పలుకు పద్యం బనియెన్.

చెవి గోసికొను నితండున్
కవనం బన నన్నుబోలి, కవివర ! మేలే
యవు మంచివేళ వచ్చితి
వీవవు రా ! యని పల్కి మెదిమె నాశాంకురముల్.

భారతవీరుం డని నే
"భారతి"కిం బంపినట్టి పద్యంబులు నా
ధోరణిలో జదివితి గం
భీరగళస్వనముతో విస్ఫుటఫణితిన్.

ఆనందబాష్పబిందువు
లానవనీతాత్మ దళులం దొలికి భళీ !
ఆనాటికర్ణశరములు
గానీ యివి పద్దియములుగావు కవీంద్రా !

అనుచు మెచ్చుకొనెదు నంతలోన తెనాలి
ప్లాటుఫారమందు బండి నిలిచె
పోయివత్తు నంచు బోవు నన్నుం గౌగి
లించి, కొంచె ముండు మంచు బలికె.

కరుణావీరరసాలు నీకలమునం గంగాప్రవాహంబులై
పరువుల్ వారు శివాజికావ్యము రచింపన్ గోరెదన్ దానికిన్
వరుడ న్నే నని పచ్చనోట్లయుగళిన్ నాహ స్తమం దుంచి. య
చ్చెరువున్ గొల్పి ప్రయాణమై చనియె. శ్రీ శ్రీశైలపత్యాఖ్యుడున్.

కృప నన్ను నేల శ్రీ శై
లపతియె రావూరి సత్కులద్యోమణియై
యుపకృతి చేయం బుట్టెనొ
కపటార్యమనందనుండొ కద యనుకొంటిన్.

కృతిపతివంశము, శివభూ
పతివంశము కొంత వ్రాసి బాపట్లకు బో
యితి నొక పర్యాయము వినిపిం
చితి శ్రీ శ్రీశైలపతికి శీలవ్రతికిన్.

# కుప్పుసామి పరిచయము

జిల్లాబోర్డధిపతియై
కొల్లగ టీపారిటీలు గొనుచుండె యశం
బుల్లసిల క్రమకులరా
ట్టల్లజు డగు కుప్పుసామి దానస్థిరుడై.

ఘనసన్మానసభామహోత్సవము సంకల్పించి ఆనాడు మా
వినుకొండం గల బోర్డుమెంబరులు తరద్వృత్తాంత మాలించి, ర
మ్మని ఆహ్వానము రాకపోయినను పద్యశ్రేణి సృష్టించి హె
చ్చిన యుత్సాహముతోడ బోయితిని సంసిద్ధుండనై వేళకున్.

చదివిరి పెక్కురు కవు ల
య్యదనున నాపద్దియముల కాత్మ నలరి నూ
ర్పదియారుల్ చదివించె సభా
సదు లచ్చెరువంద కుప్పుసామియు ప్రేమన్.

ఉభయభాషాప్రవీణు లుద్యోగములకు
ప్రాకులాడెడు పండితుల్ పలువురుండ
యోగ్యతలు లేని నాకు నుద్యోగ మిచ్చి
పండితుని జేసి పంపె బాపట్లబడికి.

క్రమముగ నెన్మిదేడులు మెకాల్డొరసాని నిరంకుశాధికా
రమునకు లొంగిపోయిన శిరంబు నిటారుగ నిక్క, దాస్యపా
శము విడినట్టు లామిషనుసర్వీసు కాళ్ళకు మ్రొక్కి నిండుమో
దమున పరిగ్రహించితిని తత్పదవిన్ హితు లుల్లసిల్లగన్.

పదియునారేండ్ల లేలేతప్రాయమందె
మా కుపాధ్యాయుడై తెల్గుమధురిమంబు
నోలి తెల్పిన శ్రీ యోగిరాల శాస్త్రి
పీఠమే యబ్బురముగ నబ్బినది నాకు.

పంచాపకేశు డను గా
వంచాల ద్రావిడీడు పంతుళ్ళను పా
లించు బడాపంతులుగా
పంచాశద్వర్షములకు పైగా నుండెన్.

నాపద్యపఠనవై ఖరి
నాపాఠము చెప్పుతీరు నచ్చినదేమో
రేపులు మాపులు క్లాసున
కోపికతో వచ్చి వినుచునుండు దినంబున్.

ఏమియ! యేమియ్యా! కుప్పు
సామీ! అడడడడ వీ డసాదు డనుచు నా
సామర్థ్యము నుతిచేయుచు
ప్రేమించెన్ గుప్పుసామి విస్మయమందన్.

వినుకొండకు పదవి మార్పించుకొంటి
కతిపయదినాల కాయూరిమెతుకు పడక
సుగుణములవెల్లి నాకూర్మిసుదతిమిన్న
గృహము దీర్పంగ కృతులు నిర్మించుచుంటి.

కేలను డబ్బులేదు సురిగెన్ సహజన్ముని పెండ్లి నాపయిన్
నాలుగువేలు గావలయు నాకనినన్ మరుమాట లేక శ్రీ
శైలపతిప్రభుండు సహజన్ముడు గాని సహోదరుండు నా
నాలుగువే లొసంగె కరుణన్ నెరవేర్చితి పెండ్లికార్యమున్.

ఇరువురుకూతులు తనుభవు
లిరువురు నిల్లాలు పితలు యేకలతలకున్
గురిగాక హాయిగా కా
పురమును సాగించినా మపూర్వైక్యతతో.

గోపరాజుగారి కోడలై మొనమొన్న
పట్టభద్రయైన చిట్టితనయ
లలితహృదయ హేమలతయు నా పిరదౌసి
కృతికుమారి యొక్క-యీడువారె.

అచ్చుకు డబ్బులేక కథయం దొక కొంత రచించి యెందుకో
నచ్చక పూర్తిచేయకయె నాలుగునెల్లు సగంధగోష్ఠులం
దచ్చట నిచ్చటన్ జదువు టప్పటి మా బడిపెద్దపంతులు
దృచ్చరితుండు నా యభిమతంబు గ్రహించి కృపాంతరంగుడై.

నా తండ్రికి కృతియి మ్మది ·
ఖ్యాతికి రాగలదు మంచికావ్యం బని నా
చేతం బుత్సాహ స
మేతముగా బలికి దొడ్డమే లొనరించెన్.

ప్రథను గొన్న సింగరాజు మల్లపరాజు
కల్ల కపటమునకు కానివాడు,
పరహితార్థమునకు పనికివచ్చెడువాడు
పలికి బొంకుపనికి పనికిరాడు.

తొలి ముద్రాక్షరరూపురేఖలపసందుల్ సింద పిర్దౌసి పల్కులకల్యాణికి భూషగా సకలదిక్కుల్ ద్రొక్కి క్రీడించి, పెద్దల వ్యాఖ్యాతల మన్ననల్ వడసి విద్యాశాలలం బట్టణంబుల నార్జించె ప్రజాదరంబును యశంబున్ యావదాంధ్రంబునన్.

చందురునిలోని నల్లని
కందును ముసలమ్మ యండ్రుగద, యొకదినమున రా
కేందుని గనుగొని కవితా
స్పందనమై స్వప్నకథను వ్రాసితి నెలమిన్.

ఘను డగు పీఠపురీశుం
డనాథజనతాశరణ్యు, డదిగాక కవీ
డ్జనతాపోషకు డని విని
చనిచూచితి చెన్నపురి, ప్రసన్నుం డగుచున్.

వినియెన్ నాకృతులన్; సదాదరణ జూపెన్; తీయగా ముచ్చటిం
చెను, నవ్వించెను, నవ్వె, నా కవిత మెచ్చెన్, మెల్లగా సాగనం
పెను, పంపున్ బహుమానమంచు మది నువ్విళ్ళూరుచుండంగ వ
చ్చెను బొచ్చెం దభివందనంబులు ఘనాశీర్వాదలేఖాంశముల్.

అంగుష్ఠము మొదలుగ స
ర్వాంగకములు చచ్చుపడ్డయట్టై, యాశా
భంగంబై పంపితి ను
ప్పొంగువిచారమున పద్యమును భూపతికిన్.

ఒకరాజన్యుని దర్శనార్థమయి యెన్నోయత్నముల్ చేసి, నూ
టికి పైగా వ్యయపెట్టుకొంటి, కనుగొంటిన్ గాని లాభింపలే
దొక యేగానియు, పిమ్మటం బనిపినా దోదార్పువాక్యాలు లె
క్కకురానన్ని సలాము లిప్పటికి నింకన్ పెట్టెలన్ మూల్గెడిన్

# రెడ్డిగారి పరిచయము

కనిగిరి తాలూకాటో
ద్దనకుం బతియగుచు బ్లీడరుల రతనంబై;
ఘనుడగు మాల్కొండాభి
ఖ్యుని పరిచయ మయ్యె నాకు నొంగోలుపురిన్.

అరుదె మ్మొకపరి మా స్వః
పురికిం గనిగిరికి, యాచభూపతికి నినున్
బరిచయము చేతు నని యు
త్తరువున నుత్తరము వచ్చె దానిం గొనుచున్.

మరునాడే పయనంబు గట్టి చని శ్రీమాల్కొండరెడ్డింట చు
ట్టరికంబున్న యటుల్ భరీగతిని యిష్టాగోష్ఠి గావించి, వీ
రరసోదంచితఘట్టముల్, శివధరారాజన్యకావ్యంబులో
మెరుగున్ రెడ్డికడం బఠింప నతడున్ మెచ్చెన్ రసాస్వాదియై.

పిరదౌసికావ్యమునకున్
పరిచయమై, సరసులయిన పఠితలకు కవీ
శ్వరులకు నెరిగిన నెరుగని
విరసులకుం జూపె నన్నవేలోత్సుకతన్.

ఎరుకపరచె నన్ను నెదురైనవారికి
యెదురుపడనివారి కిండ్ల కేగి
ఊర నున్నవారి కున్నవారికి లేని
వారి కేమనందు వారిప్రేమ.

బుచ్చిరెడ్డిపాలెమున దొడ్డరెడ్డి, యా
నాటి పార్లమెంటునాయకుండు
సుజనబాంధవుండు బెజవాడ రామచం
ద్రునకు నాకు గొంత దోస్తి కలిసె.

ఇరువురు రెడ్లున్, వేంకట
గిరినృపునకు నన్ను జూపి కృతినందు మిత్రం
డురువిద్వాంసుడు, కవి యని
యురువుగ నగ్గింప నాత డుత్సాహమునన్.

మా యాచేంద్రకుమారభూపుల యశోమర్యాద లేలాటివో
మా యౌదార్యగుణంబులం బలుకుమీ మత్తేభవృత్తంబులో
నీయాశీర్వచనంబు యెన్నికలలో నెగ్గింపగా నాశ్రవః
పేయంబౌ కృతి నల్లుమం చడిగె పృథ్వీనేత సాపేక్షుడై.

చెప్పితి నాలుగు పద్యము
లప్పటి కప్పటికి నృపతి యానందించెన్
తప్పం దడికలు స్మృతియం
దప్పటికే మాసె బుద్ధిదాళివిధానన్.

నిందించి పీఠపురిరా
జేందున కంపించినట్టి కృతి చదివితి త
త్సందర్భ ముగ్గడించుచు
మందిర మదరంగ నవ్వె మహిపాలుండున్.

న న్నీరీతి బజారుచేయకయ మున్నన్ గొంచు పొమ్మంచు న
న్నిన్నూరారుల సత్కరించె నొగి సంతృప్తిన్ ధరానేత, రె
డ్లు న్నా సాహస మెంతయుం బొగడి నెల్లాదెల్ల చాటించి రెం
దున్నాడో యిపు డాధరారమణు డాయుస్సారసంపూర్ణుడై.

నెల్లుట్ల సుకవి కబ్బపు
బిల్లన్ 'సురబాల' దెచ్చి పెండ్లాడు మిదే
యల్లునకు గట్నమని నా
యుల్లము పుష్పింప నిచ్చె నొకనూరారుల్.

నతులు సహోదరా! నిను మనంబున జూచితి, నీకృతుల్ సమం
చితరసికోత్తమభ్రమరసేవితమంజులపుష్పమంజరీ
తతులు సుమార్చయే తెలుగుతల్లికి, భేషర! జాషువా, సువా
సితసకలాంధ్రభూవలయ సిద్ధకవిత్వవసంతవై భవా!

కృతు లిట్లాయాకవిస
న్నుతులం గొని వచ్చుచుండె నూరార్లాప్యా
యత నిచ్చి సభలకధ్య
క్షత కాహ్వానించువారు గల్గిరి దిశలన్.

తుమ్మలకవి నాదగు కా
వ్యమ్ములదోషములు జూపి ప్రకటించె నసా
రమ్ముల వ్యాకరణపురం
ధ్రమ్ముల పత్రికల రసికతతి వెఱగందన్.

మానుడు మీరు, మీకు నభిమానుల ముంటిమి వారికిన్ సమా
ధానము మే మొసంగెదము, దండి కళందున కుండవే, కవీ
శానుడు కాళిదాసునకు సాధు లసాధులు తూచి శబ్దసం
ధానము చేయునట్టి కవితల్, రసగంధవిహీనపుష్పముల్.

అభిమాను లట్టు లవి నా
కభయం బిడి ప్రతిజవాబు లందించిరి, మా
యుభయులభాషాయుద్ధము
రభసకు రాకుండ నెల్లరకు మోదముగన్.

సరసుడు తుమ్మలచౌదరి
విరమించి సగంధుడయ్యె విరమింపం డా
నెరిసున్నా లరసున్నా
ల్వెరపించెడు త్రోవలందు విహరించుటలున్.

పండితోద్యోగ మూడు నుద్దండలీల
కవనమల్లెడు సుకవిరాక్షసునకైన
ఉభయభాషాప్రవీణ లేకున్న నంచు
హెచ్చరించుచు తాఖీదు వచ్చె నాకు

ప్యాసయితి నదియు, భాషా
వ్యాసంగము నెరపుచుంటి పవలున్ రేయున్
నాసతి కాదొక దేవత
చేసెడు పరిచర్య ఖెడద స్తిమితం బిడగా.

ధీవిశాలుండు విక్రమదేవవర్మ
జయపురీశ్వరు దఖిలశాస్త్రప్రవీణు
డాదరంబున నాకు నాహ్వాన మంపె
'భారతీతీర్థసంస్థో'త్సవంబు నాడు.

'కవితా విశారదా' యను
నవీనబిరుదంబు వేయినాణెములు మహా
కవిపండితచండమహా
ర్ణవ మలరగ సత్కరించె రా జవ్వేళన్.

# ఇంటిగెలుపు.

చతురుడు, విశాలహృదయుడు
మతిమంతుం డైన శ్రీ రమాకాంతుండు మా
శ్రుతగిరి తహశీల్దారుడు
కృతు లల్ల సమర్థు డాంధ్రగీర్వాణములన్.

చదివె న్నాపిరదౌసికావ్యము నపేక్షన్ మోదితుండై, యిదే
కద నీ పుట్టినయూరు నీ కిచట సత్కారంబు చేయించి పో
యెద నంచున్ వినుకొండలోన తొలి సాహిత్యార్చగా నాకు నూ
ర్పదియా ర్లిచ్చి బహూకరించె సకలాంధ్రం బెల్లన్ వ్యాపింపగన్.

కవితోద్యాన వసంతకోకిలవు! త్వత్కంఠస్వరోద్యన్మహా
సవ మింతే చవిజూచినన్ ద్విజతతుల్ సన్మార్గమున్ ద్రొక్కి మా
ధవసేవాపరతంత్రతన్ నవరసోన్మాదంబునన్ నీదు చెం
త వసంతోత్సవ మాచరించు టొక వింతా? జాషువా సత్కవీ!

నవరత్నంబుల నిడె న
య్యవసరమున ప్రేమతోడ నాచార్యుడు త
త్కవితాశక్తి కిదే యొక
రవ నిందున్ మాసరాకు వ్రాయుచునుంటిన్.

పిసుపాటికులుడు కవితా
రసలోలుం డచ్ఛమైన బ్రాహ్మణుడు భిష
గ్విసదృహబంధుడు సుజనా
గ్రసరుడు పిలిపించె హైదరాబాదునకున్.

కృష్ణరాయాంధ్రభాషానికేతనమున
నెలమి సత్కార మొందు చేయించి పంపె
నాటికిని నేటికిని భాగ్యనగరమందు
వారియాతిథ్యమున తృప్తిపడక రాను.

## దండయపరిచయము

ఏకా దండయ, యెవరో
నా కవితంగూర్చి చెప్పినా రని, యొకమా
ర్నా కగపడిపొమ్మని ప్రే
మాకలితమనస్కు డగుచు నాహ్వానించెన్.

అతడు రహస్యదానమున యందు ప్రసిద్ధిని గన్నవాడు, పా
త్రత గణియింపకుండ యొకదమ్మిడి వమ్మొనరింప నట్టి యం
చితు డిసుమంతమాట తబిసీలు పొసంగిన నేటివారితో
నతకని చిత్రమగు వ్యక్తి మహాఘటికుండు వాదనన్.

నను జాషువ యందురు, ర
మ్మని లేఖ లిఖించినారు మాట్లాడగ వ
చ్చినవాడ నన్నుః 'నౌ నౌ'
నని ఆసన మిచ్చి. సస్మితాసను డగుచున్.

"రైలుఖర్చుల కిద్ది రిక్షాల కిద్ది
ఆకుబీడీల కిది తిండి కగున దిద్ది
మొత్త మగు మూడు రూకలమూడణాలు
మొదటకొ"మ్మని నాహస్తమున నొసంగె.

"అసలు కవనమన్న అందలి రస మన్న
ముక్కుమొగ మెరుంగ నిక్కముగను
కవనమందు నీవు ఘటికుండ వని వింటి
చేతనయినమేలు చేయ నుంటి.

అచ్చుకు సిద్ధమైన కృతి హాజరుగా కలదేని దాని నే
నచ్చున కిత్తు నాపితల కంకితమి మ్మది, పూర్వజన్మమం
దెచ్చట నాకు నీకు నెపుడే ఋణబంధము సంఘటించెనో
యిచ్చట దీర్చుకొందు నిది ఈశ్వరునాజ్ఞ జుమీ కవీశ్వరా";

కలవు రెండుభాగములు ఖండకావ్యాలు
వాని నచ్చుకీయవచ్చు నంచు
దండయార్యుతల్లిదండ్రుల వినుతించి
కృతి యొసంగినాడ నతిముదమున

**ఉచితం బని తోచినచో**
**ప్రచురింపుండు జాషువాకృతులంచున్**
**రచియించె విల్లునం దా**
**సుచరిత్రుం దేజగాన శోభిల్లెడినో.**

ఉచిత మని తోచలేదు తత్ప్రచురణంబు
చాలు నొకమా రనుచును ట్రస్టీలు రసికు
లామహాత్మునియాత్మస్వర్గాలయమున
నలిగి విలపింప మానుకొన్నారు నేడు.

# స్వాతంత్ర్యోద్యమము

అది స్వరాజ్యోద్యమప్రరోహంబు దిశల
మొలకలెత్తినవేళ బాపూజి పేరు
సేతుశీతాద్రివరకు భాసించి ఆంగ్ల
గజము నెదిరించి తొడగొట్టు గడియె లవ్వి.

మిడుగురులు లేచె నణగిన
బెడిదపు శౌర్యాగ్నిశిఖలు మాంచాలపురిన్
బడబానలమన 'హనుమం
తుడు' వీరుడు తెల్లదొరలతో నెదిరించెన్,

బాలుడు పల్లెనాటి నెలబాలుడు, శత్రుగజాలగుండియల్
వ్రీల నటించి, సుగ్రరణవీథుల నర్వదియారుబారుభ
ల్లాలకు నగ్నమై మడయు లాగున, నా'హనుమంతు' డాంగ్లభూ
పాల శతఘ్నులన్ గరగి పౌరుషభిక్ష యొసంగె నాంధ్రికిన్.

అవనీనాధులు బెగ్గిలన్ తొలుత బ్రహ్మాండంబుగా స్వాగతో
త్సవమున్ గర్తపురాన జాతిపితకున్ సత్యాగ్రహుల్ చేయునా
డవరోధించు ప్రభుత్వసైనికుల దౌష్ట్యంబెల్ల నీక్షించి క
న్గవ నీరూర రచించినాడ నరపక్రవ్యాదచర్యావళిన్

కొండా, యున్నవ, దేశభక్తులగు త్యాగుల్ వీరసత్యాగ్రహో
ద్దండుండైన తెలుంగుకేసరియు, సీతారామశాస్త్రియిదివే
దండంబుల్ చెరసాలబద్ధులయి స్వాతంత్ర్యార్థమై పోవుచో
గుండెల్ నీరయి దుఃఖపడ్డయవి దిక్కుల్ గ్రుక్కిళుల్ మ్రింగుచున్

బలిజేపల్లికవీంద్రుని
బలిమిం బంధించి రతడు వ్రాసినకృతికిన్
వలవలయేడ్చెనతం డిక
విలిఖింపనటంచు, కవులు భీరువులు గదా ?

అది గని నేవ్రాసినకృతి
పదిలంబుగ జేబులోన భద్రపరచితిన్
పదుగురిలో జదివిన నా
పద వచ్చునటంచు హితులు భయముంగొలుపన్.

నాచేసినయపరాధము
దాచుకొనక చెప్పుకొంట ధర్మం బని సం
కోచింప కెఱుకపరచితి
ధీచతురత లేనిగడుసు దేరని చర్యల్.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA112B167 |
| పుస్తకం పేరు | నా కథ 02 |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 75 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | 4, Bci |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Triveni |
| పేజీలు విడదీసినది | Triveni |
| స్కాన్ చేసినది | Aswini |
| పరీక్ష చేసినది | PRAGATHI |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |